# పరిశుద్ధ లేఖనములు.

1913

Printed at the Setu Press, Masulipatam & Published

by the Rev. J. B. Panes,

Masulipatam.



II ఇహలోకమందుఅయన నివసించినప్పు
డు క్రీస్తు వః లేఖనములు ప్రామాణ్య
పు గ్రంథములని యెంచి వాటిలోనుండి
వాక్యములను ఎత్తి బోధించెను. అం
త్యదినమందు క్రీస్తుమాటలవలన మను
ష్యులు తీర్పు పొందుదురు.

మత్తయి అప్పుడుయేసు సాతానుచేత శోధింపబడుటకు
4:1-10 ఆత్మవలన అరణ్యమునకు కొనిపోబడెను. 2 వ
నలుబదిదినములు దివారాత్రిలు ఉపవాసముం
చిన పిమ్మట ఆయన ఆకలిగొనగా 3 వ. ఆశోధ
కుడు ఆయన యొద్దకువచ్చి— నీవు దేవునికుమా
రుడవైతే ఈరాళ్లు రొట్టెలగునట్లు ఆజ్ఞాపించు
మనెను 4 వ. అందుకాయన:—
మనుష్యుడు రొట్టెవలన మాత్రము కాదుగాని దేవు
ని నోటనుండి వచ్చు ప్రతిమాటవలనను జీవించును.
వ్రాయబడి యున్నదనెను. 5 వ. అంతట సాతాను

మత్తయి అందుకు యేసు వారిని చూచి
21:42 —ఇల్లు కట్టువారు నిషేధించినరాయి
మూలకు తలరాయి ఆయెను.
ఈ కార్యము ప్రభువు వలననే కలిగెను
ఇది మన కన్నుల కాశ్చర్యముగా నున్నది.
అనుమాట మీరు లేఖనములలో ఎన్నడును చదువలేదా!
మత్తయి అందుకు యేసు— 29 వ. మీరు లేఖనములను
22:29.32. దేవుని శక్తిని ఎరుగక పొరబడు చున్నారు.
30 వ. పునరుత్థానమందు పెండ్లి చేసికొన
రు. పెండ్లి కియ్యబడరు; పరలోకమందున్న
దూతలవలెనే యుందురు. 31 వ. మృతుల
పునరుత్థానమునుగూర్చి 32వ. నేను అబ్రాహాముదే
వుడను, ఇస్సాకు దేవుడను, యాకోబు దేవు
డనై యున్నానని దేవుడు మీతో చెప్పినమాట
మీరు చదువలేదా? 33 వ, ఆయన సజీవులకే
దేవుడుగాని మృతులకు దేవుడుకాడని వారితో
చెప్పెను. జనులదివిని ఆయన బోధకాశ్చర్య
పడిరి.

పరి. లూకా తరువాత ఆయన తాను పెరిగిన నజరేతునకు
4:16-21 వచ్చెను. తన వాడుక చొప్పున విశ్రాంతిదినమందు
సునగోగులోకి వెళ్లి చదువుటకై నిలుచుండగా
17 వ. ప్రవక్తయైన యెషయా గ్రంథమాయన
చేతి కియ్యబడెను.;
ఆయన ఆ గ్రంథము విప్పగా—

18 వ. యెహోవా ఆత్మ నామీద నున్నది
బీదలకు సువార్త ప్రకటించుటకై
ఆయన నన్నభిషేకించెను.
చెరలలో నున్న వారికి విడుదలను,
గ్రుడ్డివారికి చూపును (కలుగునని) ప్రకటించు
టకును, నలిగినవారిని విడిపించుటకును.

19 వ. యెహోవా హితవత్సరము ప్రకటించుటకును,
ఆయన నన్ను పంపియున్నాడు.
20 వ. అని వ్రాయబడినచోటు ఆయనకు దొరికెను.
21 వ. ఆయన గ్రంథము చుట్టి పరిచారకునికిచ్చి కూర్చుండెను
సునగోగులోనున్న వారందరు ఆయనను తేరిచూడగా ఆయన

వని ప్రవక్తలందరు ఆయనను గూర్చి సాక్ష్యమి
చ్చుచున్నారనెను.

అ॥ కార్యము అతడు యేసే క్రీస్తు అని లేఖముల ద్వారా
లు 18: 28 దృష్టాంతపరచి బహిరంగముగా యూదుల
వాదమును గట్టిగా ఖండించుచు వచ్చెను.

iv వ॥ లేఖనములు సత్యమార్గమును బైలుపర
చి అందులోనికి మనుష్యుని నడిపించును,
అవి యేసుక్రీస్తునందున్న విశ్వాసము
ద్వారా రక్షణార్థమైన జ్ఞానము కలుగ
చేయును.

కీర్తన 19: యెహోవా నియమించిన ధర్మశాస్త్రము య
7-8. థార్థమైనది. అది ప్రాణమును తెప్పరిల్ల చేయును
యెహోవా శాసనము నమ్మదగినది. అది బుద్ధిహీ
నులకు జ్ఞానము పుట్టించును.

8. యెహోవా ఉపదేశములు నిర్దోషమైనవి. అవి
హృదయమును సంతోషపరచును. యెహోవా ఏర్పరచిన

ధర్మము నిర్మలమైనది. అది కన్నులకు వెలుగిచ్చును.

యెషయా ధర్మశాస్త్రమును ప్రమాణవాక్యమును విచారిం
8:20. చుడి. ఈ వాక్యప్రకారము వారు బోధించని
యెడల వారికి అరుణోదయము కలుగదు.

లూకా అందుకు అబ్రాహాము—వారియొద్ద మోషే
16:29-31 యును ప్రవక్తలును న్నారు— వారిమాటలువిన
వలెనని అతనితో చెప్పగా!

30 వ. అతడు— తండ్రియైన అబ్రాహామా అలా
గనవద్దు, మృతులలోనుండి యొకడు వారియొద్దకు వెళ్లిన
పక్షమున వారుమారుమనస్సు పొందుదురని చెప్పెను.

31 వ. అందుకతడు-మోషేయు ప్రవక్తలును చెప్పి
నమాటలు వారువిననియెడల మృతులలోనుండి యొకడు
లేచినను వారునమ్మరని అతనితో చెప్పె నని.

యోహాను సత్యమందు వారిని ప్రతిష్ఠచేయుము; నీ
17:17. వాక్యమే సత్యము.

యోహాను మరియు వేరే అనేకమైన సూచకక్రియలను
20:30-31 యేసు తనశిష్యులఎదుట చేసెను. అవి యీ

గ్రంథమందు వ్రాయబడి యుండలేదు 31 వ.
గాని యేసు దేవుని కుమారుడైన క్రీస్తు అని మీ
రు నమ్మునట్లు నమ్మి ఆయన నామమందు జీవము
పొందునట్లును ఇవి వ్రాయబడెను.

రోమా 15:4 ఏమనిన ఓర్పువలనను లేఖనముల వలని ఆదర
ణవలనను మనకు నిరీక్షణ కలుగుటకై పూర్వమం
దు వ్రాయబడిన వన్నియు మనకు బోధ కల్గు
నట్లు వ్రాయబడినవి.

IIతిమో థె విశ్వాసముద్వారా రక్షణార్థమైన జ్ఞానము నీకు
యు 3: కలిగించుటకు శక్తిగల పరిశుద్ధ లేఖనములను
14-15. బాల్యమునుండి నీ వెరుగుదువు గనుక నీవు నే
ర్చుకొని రూఢియని తెలిసికొన్నవి యెవరివలన
నేర్చుకొంటివో ఆసంగతి తెలిసికొని వాటి
యందు నిలకడగా నుండుము—

యాకోబు అందుచేత సమస్త కల్మషమును విస్తరించుచున్న
1:21. దుష్టత్వమునుమాని, లోపల నాటబడి మీయా
త్మలను రక్షించుటకు శక్తిగల వాక్యమును

వారియొహా లేఖనములయందు మీకు నిత్యజీవము కలదని
యో 5: 39- తలంచుచు వాటిని పరిశోధించుచున్నారు. అవి
40,40.47 నన్నుగూర్చి సాక్ష్యముచెప్పుచున్నవి. 40వ. గాని
మీకుజీవము కలుగునట్లు మీరు నాయొద్దకు రా
నొల్లరు 44 వ. అద్వితీయదేవునివలన వచ్చు
మెప్పును కోరక యొకనివలన నొకడు మెప్పుపొం
దుచున్న మీరెలాగునమ్మగలరు! 45 వ. నేను
తండ్రియొద్ద మీమీద నేరము మోపుదునని తలం
చకుడి; మీరాశ్రయించుచున్న మోషే
మీమీద నేరముమోపుచున్నాడు. 46 వ. అతడు
నన్నుగూర్చి వ్రాసెను. గనుక మీరుమోషేను
నమ్మినట్టయిన నన్నును నమ్ముదురు. 47 వ
మీరతని నమ్మనియెడల నామాటల నెలాగు
నమ్ముదు రనెను.

కొలొస్సై 3: సంగీతములతోను కీర్తనలతోను ఆత్మ సంబం
16 ధమైన పద్యములతోను ఒకనికొకడు బోధిం
చుచు బుద్ధిచెప్పుచు కృపాసహితముగా మీహృ

దశకములలో దేవునిగూర్చి గానముచేయుడు
సమస్తవిధములైన జ్ఞానముతో క్రీస్తువాక్యము
మీలో సమృద్ధిగా నివసింప నియ్యుడి.

యాకోబు 1: నా ప్రియసహోదరులారా మీ రీసంగతి
19-22 యెరుగుదురు. గనుక ప్రతిమనుష్యుడు వినుటకు
వేగిరపడువాడును మాటలాడుటకు నిదానించు
వాడునై యుండవలెను. 20 వ. ఎందుకనగా
దేవునిదృష్టికి నరుని కోపము నీతిని నెరవేర్పదు.
21 వ. అందుచేత సమస్త కల్మషమును విరకి
గుచున్న దుష్టత్వమును మాని లోపల నాటబడి
మీ యాత్మలను రక్షించుటకు శక్తిగల వాక్య
మును సాత్వికముతో అంగీకరించుడి. 22 వ. మీ
రు వినువారుమాత్రమే కాక వాక్యప్రకారము
ప్రవర్తించువారునై యుండుడి. వినువారుమాత్ర
మైతే మిమ్మును మీరే మోసపుచ్చుకొందురు.

vi వ. శేఖవములు అందరికిని పిల్లలకు సహా
బోధింపబడవలెను, ఇంట్లో నేమి ప్రయా

గానుండేమి ఎక్కడనుండినను వాటిని
గూర్చి సంభాషించి తెలుపుచుండ
వలెను.

ద్వితీయో 6: నేడు నేను నీకాజ్ఞాపించు ఈమాటలు నీహృ
6-9 దయములో నుండవలెను 7 వ. నీవు నీకుమా
రులకు వాటిని అభ్యసింపజేసి, నీయింటకూ
ర్చుండునప్పుడును త్రోవను నడుచునప్పుడు పండు
కొనునప్పుడును లేచునప్పుడును వాటిని నీచేతి
కి కట్టుకొనవలెను 8 వ. అవి నీకన్నులనడుమ
బాసికమువలె నుండవలెను 9వ. నీయింటిద్వార
బంధములమీదను నీగవునులమీదను వాటిని వ్రా
యవలెను.

ద్వితీయో: నీదేవుడైన యెహోవా ఏర్పరచుకొను స్థల
31: 11-13 మందు ఇశ్రాయేలీయులందరు ఆయనసన్నిధిని
కనబడి పర్ణశాలల పండుగ ఆచరించునప్పుడు
ఇశ్రాయేలీయులందరి యెదుట ఈధర్మశాస్త్రము
ను ప్రకటించి వారికి వినిపింపవలెను.

కీర్త 19: యెహోవా నియమించిన ధర్మశాస్త్రము యథా
7-8 ర్థమైనది. అది ప్రాణమును తెప్పరిల్లజేయును. యెహోవా శాసనము నమ్మదగినది. అది బుద్ధిహీనులకు జ్ఞానము పుట్టించును. 8 వ యెహోవా యుపదేశములు నిర్దోషమైనవి. అవి హృదయమును సంతోషపరచును, యెహోవా ఏర్పరచిన ధర్మము నిర్మలమైనది. అది కన్నులకు వెలుగిచ్చును.

కీర్త 119: యౌవనస్థులు దేనిచేత తమనడత శుద్ధపరచు
1,11,93, కొందురు? నీ వాక్యమునుబట్టి దానిని జాగ్రత్త
111,130 గా చూచుకొనుటచేతనే గదా?

11 వ. నీయెదుట నేను పాపము చేయకుండునట్లు నా హృదయములో నీవాక్యముంచుకొని యున్నాను. 93 వ నీయుపదేశములవలన నీవు నన్ను బ్రతికించితివి. నే నెన్నటను వాటిని మరువను. 111 వ నీ శాసనములు నాకు హృదయానందకరములు అవి నాకు నిత్యస్వాస్థ్యమని భావించుచున్నాను. 130 వ. నీవాక్యములు వెల్లడి యగుటతోడనే

రందరిని వెలిగించుపరిశుద్ధాత్మయే వా
టిభావమును బైలుపరచును.

ప॥యోహా॥ సు 14:25,26. నేను మీయొద్ద నుండగానే యీ మాటలు మీతో చెప్పితిని 26. వ, ఆదరణకర్త అనగా తండ్రి నా నామమున పంపబోవు పరిశుద్ధాత్మ సమస్తమును మీకు బోధించి నేను మీతో చెప్పిన సంగతు లన్నియు మీకు జ్ఞాపకము చేయును.

ప॥యోహా॥ సు 16:13,14 అయితే ఆయన అనగా సత్యస్వరూపియైన ఆత్మ వచ్చినప్పుడు మీరు సత్య మంతయు గ్రహించునట్లు ఆయన మిమ్మును నడిపించును. ఆయన తనంత తానే యేమియు బోధింపక వేటిని వినునో వాటిని బోధించి జరుగబోవు సంగతులను మీకు తెలియజేయును. 14 వ. ఆయన నావాటిలోనివి తీసికొని మీకు తెలియజేయును గనుక నన్ను మహిమపరచును.

1 కొరింథీ దేవుడు తన్ను ప్రేమించువారికొరకు సిద
2:9-14 ద్ధపరచినవి ఏ కంటికి కనబడలేదు, చెవికి
వినబడలేదు, మనుష్య హృదయమునకు గోచ
రము కాలేదు అని వ్రాయబడియున్నది. 10.వ.
మనకైతే దేవుడు వాటిని తన ఆత్మవలన బయలు
పరచియున్నాడు; ఆ ఆత్మ అన్నిటిని దేవుని
మర్మములనుకూడ పరిశోధించుచున్నాడు 11.వ.
ఒక మనుష్యుని సంగతులు అతనిలోనున్న మను
ష్యాత్మకే గాని మనుష్యులలో మరి ఎవరికి తెలి

యును. అలాగే దేవుని సంగతులు దేవుని ఆత్మకే మరియె
వనికిని తెలియవు. 112 వ. దేవునివలన మనకు దయచేయ
బడినవాటిని తెలిసికొనుటకై మనము లోకాత్మను కాక
దేవునియొద్దనుండి వచ్చు ఆత్మను పొందియున్నాము. 13వ.
మనుష్యజ్ఞానము నేర్పుమాటలతో కాక ఆత్మసంబంధమైన
సంగతులను ఆత్మసంబంధమైన సంగతులతో సరిచూచుచు
ఆత్మ నేర్పుమాటలతో వీటినిగూర్చి మేము బోధించు

వాక్యమును నేను ధ్యానించుటకై నా కన్నులు రాత్రిజా
మములు కాకమునుపే తెరువబడును.

వ॥ యోహా లోకములోనుండి నీవు నాకనుగ్రహించిన
ను17: 6. మనుష్యులకు నీ నామమును ప్రత్యక్షపరచితిని.
వారు నీవారైయుండిరి, నీవు వారిని నాకనుగ్ర
హించితివి; వారు నీవాక్యము గైకొనియు
న్నారు.

X అవిధేయులును అవిశ్వాసులును దేవు
నివాక్యమును వినకపోవుదురు. ఇట్టివా
రందరినిగూర్చి దేవుడు తీర్పుచేయును.

సామెతలు నేను పిలువగా మీరు వినకపోతిరి. నా చేయి
1: 24-25 చాపగా ఎవరును లక్ష్యపెట్టక పోయిరి. 25 వ
26,28,29 నేను చెప్పినబోధ యేమియు మీరు వినక త్రో
సివేసితిరి. నేనుగద్దింపగా లోబడకపోతిరి. 26 వ. కావున్
మీకు అపాయము కలుగునప్పుడు నేను నవ్వెదను. మీకు

భయమువచ్చునప్పుడు నేను అపహాస్యము చేసెదను 28 వ. అప్పుడు వారు నన్ను గూర్చి మొఱ్ఱపెట్టెదరు, గాని నేను ప్రత్యుత్తర మియ్యకుందును. నన్ను శ్రద్ధగా వెదకెదరుగాని నేను కనబడకుందును. 29 వ. జ్ఞానము వారికి అసహ్యమాయెను. యెహోవాయందు భయభక్తులు కలిగియుండుట వారికిష్టము లేకపోయెను.

యెషయా 5: సైన్యముల కధిపతియగు యెహోవాధర్మ
24. శాస్త్రము నిర్లక్ష్యపెట్టుదురు, ఇశ్రాయేలుయొక్క
పరిశుద్ధ దేవునివాక్యమును తృణీకరించుదురు.
కాబట్టి అగ్నిజ్వాలలవంటి నాలుకలు
కాల్చివేయునట్లు ఎండిన గడ్డిమంటలో భస్మ
మగునట్లు వారివేరు కుళ్లిపోవును. వారిపువ్వు
ధూళివలె పైకి ఎగిరిపోవును.

జెకర్యా 7: అయితే వారు ఆలకింప నొల్లక మూర్ఖులై వి
11-13 నకుండ చెవులు మూసికొనిరి. 12వ. ధర్మశాస్త్ర
ము పూర్వికులైన ప్రవక్తలద్వారా సైన్యముల
కధిపతియగు యెహోవా తన ఆత్మ ప్రేరేపణ

